# హస్తామలక స్తోత్రము-4

శ్లో॥ యమగ్న్యుష్ణ వన్నిత్యబోధ స్వరూపం
మనశ్చక్షు రాదీన్యబోధాత్మకాని,
ప్రవర్తన్త ఆశ్రిత్య నిష్కమ్పమేకం
స నిత్యోపలబ్ధి స్వరూపోఽహమాత్మా॥

తా॥ అగ్నికి ఉష్ణత్వమువలె నిత్యజ్ఞానము దేని స్వరూపమై యున్నదో,నిశ్చలమును,ఏకమును అగు దేనిని ఆశ్రయించి జడము లగు మనస్సు, నేత్రాది ఇంద్రియములు వాని వాని కార్యములు ఒనర్చుచున్నవో, అట్టి నిత్యప్రాప్తమగు ఆత్మస్వరూపమే నేను!

వ్యాఖ్య :—అగ్నికి ఉష్ణత్వము స్వభావము. ఉష్ణత్వమును విడిచి అగ్నియుండదు. అట్లే సత్తు చిత్తు, ఆనందము ఆత్మ యొక్క స్వభావములు. అనగా ఉనికి, చైతన్యము, సుఖము-అనునవి ఆత్మయొక్క స్వరూపములు. అట్టి ఆత్మ జడము కాదు. చిన్మయమైనది. ఇక మనస్సు, బుద్ధి, ఇంద్రియములు మొదలైనవి జడములు. వానికి స్వతః ప్రకాశించు శక్తి లేదు. దృక్కగు ఆత్మయొక్క సాన్నిధ్య మందు దృశ్యరూపములగు ఈ చిత్తాదులు ప్రకాశించు చున్నవి. చంద్రునకు స్వతః ప్రకాశించు శక్తి లేనట్లును, సూర్యకాంతిని గ్రహించియే చంద్రుడు ప్రకాశించునట్లును, మనస్సు ఇంద్రియాదులు ఆత్మ ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నవి. అట్టి ఆత్మయే జీవుని యథార్థస్వరూప ముగాని దేహాదులు కాదు- అని హస్తామలకుడు ఘోషించు చున్నాడు.

ఓం

ఓం
శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీకాళహస్తి
# వేదాంతభేరి
సంస్థాపకులు
శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

సంపుటము : 25 ఫిబ్రవరి 1993 సంచిక 2



**సంవత్సర చందా : రూ. 30/–లు**

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ–520 002
ఫోన్స్ : 61862, 64017, 72433
Telex : 0475 362 ANIL Fax : 0866-63017

**శాశ్వత చందా : రూ. 300/–లు.**

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి–517 640
ఫోన్స్: 2239,2543 STD Code 085 78

చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.

## అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక

# BE FEARLESS : నిర్భయులై యుండుడు!



: ముఖచిత్రము :

మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామ రామ బలరామకృష్ణ కల్కి–అవతారధారీ! హనుమత్సీతాలక్ష్మణసమేత శ్రీ రామచంద్రమూర్తీ! నీకు త్రికరణశుద్ధిగ మా నమస్సులు.

# దైవ ప్రార్థన

## (కూర్మావతారము-2)

ధరా నిర్జరారాతిభారాదపారా
దకూపార నీరాతురాధఃపతన్తీ
ధృతా కూర్మరూపేణ యేన స్వపృష్ఠే
స దేవో ముదేవోస్తు శేషాబ్జశాయీ.

ఏ దేవదేవుడు కూర్మరూపము ధరించి అసురుల పాపభారముచే నీటిలో మునిగిపోయిన భూమిని తన వీపుపై నెత్తుకుని పైకి లేవదీసెనో, అట్టి శేషశాయియగు పరమాత్మ జనులకు శాశ్వతసుఖము నొసంగుగాక! అట్టి కూర్మావతారమూర్తియగు పరమాత్మకు నమస్కారము.



# వివేకానంద శంఖారావము

We want the education by which character is formed, strength of mind is increased, the intellect is expanded, and by which one can stand on one's own feet.

దేనిచేత సచ్ఛీలము, సచ్చరిత్ర ఏర్పడునో, మనోబలము వృద్ధినొందునో, బుద్ధి వికసించునో, దేనిద్వారా మనుజుడు తన కాళ్లపై తాను నిలవగలిగి యుండునో, అట్టి విద్య మనకు కావలయును.

OO

# వేదాంతభేరి



## ధ్యానము

### శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



శ్రీ రామకృష్ణపరమహంసను ఒక భక్తుడు సమీపించి 'అయ్యా! నా మనస్సు ధ్యాన కాలములో నిశ్చలముగనుండుటలేదు. ఏదైన ఉపాయము సెలవిండు' అని ప్రార్థింప వారిట్లు చెప్పిరి—

"మీ ఇంటికి ఒకరోజున ఒక కుక్క వచ్చినది యనుకొనుడు. అది చూచుటకు బాగున్నదని తలంచి ఒక పిడికెడు అన్నము దానికి పెట్టినచో అది ఏమి చేయును? తిని వెళ్లి మరునటిరోజు మరల వచ్చును. మరల ఒక పిడికెడు అన్నము మీరు దానికి పెట్టినచో, ఇక ప్రతి రోజున్నూ మీ ఇంటికి వచ్చుచునేయుండును.

ఈ ప్రకారముగా కొన్ని సంవత్సరములు దానిని బాగుగా మేపినచో, అలవాటుపడి ఇక మీ ఇల్లు వదలనే వదలదు. కొట్టినను తిట్టినను పోదు. దానిని వదిలించుకొనవలెననిన మీరేమి చేయవలెను? ఒకటే ఉపాయము కలదు. దానికి అన్నము పెట్టగూడదు. అది రాగానే బెత్తము తీసికొని తరిమి వేయవలెను. ఇవ్విధముగ కొన్ని రోజులు వరుసగా దానిని దండించుట

మొదలుపెట్టినచో, అది చూచి చూచి విసుగెత్తి మరల రాకుండును.

ఆ ప్రకారముగనే అనేక జన్మలనుండి మనస్సునకు దృశ్యపదార్థ ములయందు మేపు లభించుచుండెను. అది అడిగినది యంతయు మనము ఇచ్చుచుంటిమి. కోరినదియంతయు కిక్కురుమనకుండ సమకూర్చుచుంటిమి. ఇవ్విధముగ శబ్దస్పర్శాది విషయ భోగములను అది బాగుగా తినమరగినది. ఇక అది చెప్పిన మాట వినునా? బయటకు పోవలదనిన ఒప్పుకొనునా? ధ్యానమందు నిశ్చలముగ నుండు మని హితము చెప్పిన పాటించునా? పాటింపదు. తనకు అలవాటు పడిన త్రిభువన సంచారమునే ఆశ్రయించును. ప్రాపంచిక భోగ్యవస్తువుల పైననే వ్రాలుచుండును. అప్పుడేమి చేయవలెను? కుక్క బెడద తప్పించుకొను టకు ఏమి చేసితిరో అదియే చేయవలెను.

మనస్సు విషయములపై వ్రాలినవుడు దానికి ఆ విషయాహార మొసంగక, భోగముల ననుభవింపజేయక వివేకమను కఱ్ఱ చేబూని, అటనుండి తరిమివేయవలెను. అట్లు తరిమినను, పూర్వాభ్యాసవశమున మరల పోవుచునేయుండును.

కాని ప్రయత్నము వదలక మరల మరల గెంటివేయుచుండినచో కొన్నాళ్ళకిక మరల నచ్చోటికి వెడలకుండును. ఈ ప్రకారముగ మనస్సెవుడు బాహ్యవస్తు వ్యామోహమును వదిలించుకొనునో, అవుడు స్వస్థానమగు హృదయమందే (ఆత్మయందే) నిలకడ కలిగియుండును. అత్తఱి పరమాత్మ ధ్యానము చక్కగ జరుగును"

కొన్ని ఇండ్లలో దొంగపశువు లుండును. అవి పగలుకాని, రాత్రిళ్లు కాని ఇతరుల చేలలో పడి దొంగ మేపు మేయుచుండును. పొలముల యజమానులు వానిని తరిమివేసినచో దూరముగ పారిపోయి మరల ఏ తోటలలోనో జొరపడి అల్లకల్లోలము చేయుచుండును. దానిచే పశువుల సొంతదారునకు ఊరివారినుండి పెక్కు ఫిర్యాదులు వచ్చుచుండును. ఆ

యవమానమును భరింపలేక ఆతడేమి చేయును? బయట ఏ గడ్డి దొఱకుచుండునో దానికంటే మంచి గడ్డిని ఇంటియొద్దనే వేసి మేపును. అపుడిక నయ్యావి బయటకు పోక ఇంటినే కనిపెట్టుకొనియుండును. అట్లే తుచ్ఛమై, క్షణికమై, నశ్వరమై, దుఃఖమిశ్రితమై, ప్రతిబింబరూపమైనట్టి అల్పానందమునుండి మనస్సును విరమింపజేయవలెననిన, అనంతమై, శాశ్వతమై, బింబభూతమైనట్టి ఆత్మానందమునందు దానిని ప్రవేశపెట్ట వలెను. దాని మహిమను మనస్సునకు చవిచూపవలెను. ఒక్కపర్యాయము రుచి చూచెనా, ఇక వదలదు.

కాబట్టి అట్టి సచ్చిదానందమును గూర్చి చిత్తమునకు బోధించి, బాహ్యవిషయములనుండి దానిని మరల్చవలెను. దీనినే ప్రత్యాహారమందురు.

ఇవ్విధముగ ఇంద్రియమనంబులకు హితము చెప్పవలెననిన బుద్ధి ఎంతయో తీక్ష్ణముగను ధైర్యోత్సాహ సమన్వితముగను నుండవలెను. 'బుద్ధ్యా ధృతి గృహీతయా' (ధైర్యముతో గూడిన బుద్ధిచే మనస్సును స్వాధీనపఱచుకొని ఆత్మయందుంచవలెను) అని భగవానుడు తెలిపియే యున్నారు.

అధైర్యమునకు, పిరికితనమునకు అధ్యాత్మరంగమున తావులేదు. ప్రకృతిని, అవిద్యను జయించుట సామాన్యమైన పనికాదు. ఆ పనికి "ఇనుప కండరములు, ఉక్కు నరములు, గంభీర బుద్ధులు" అవసరములై యున్నవి. ఉపనిషత్తులన్నియు ఈ సత్యమునే ఘోషించుచున్నవి.

ఆత్మ బలహీనునిచే పొందజాలదని ముండకోపనిషత్తు తెగవేసి చెప్పినది. ఒకానొక ధీరుడు మాత్రమే దృష్టిని అంతర్ముఖముగ మరల్చి ప్రత్యగాత్మను దర్శింపగలుగుచున్నాడని కఠోపనిషత్తు పలుకుచున్నది. ధైర్యమును జేబట్టినచో మాయను తరిమికొట్టవచ్చును. ధైర్యమొకింతేని సడలినచో మాయ మనలను తరిమికొట్టును. ఇదియే ఇచటగల రహస్యము. ఒక పిల్లవానిని కోతి తరుముచుండెను. వాడు పారిపోవుచుండ త్రోవలో

నొక పెద్దమనిషి "నాయనా పారిపోవద్దు, వెన్ను చూపినచో అది ఇంకను నిన్ను తరుమగలదు. కావున వెనుకకు తిరిగి కోతిని ధైర్యముతో ఎదుర్కొనుము (Face the devil)" అని చెప్ప నాతడట్లే చేయగా తక్షణమే కోతి భయపడి పారిపోయెను. ప్రకృతితోటి మనము చేయు సంగ్రామమున్ను ఇట్లే యుండును. ధైర్యము, నిర్భయత్వము, నిర్విచారత్వము– ఇవియే పరమార్థరంగమున మూలమంత్రములు. ఇవి కలవానికే అట దారి దొఱకును. తక్కినవారికి దొఱకదు.

కావున భగవానుడు తెలిపినట్లు ధైర్యము నవలంబించి మెల్ల మెల్లగ మనస్సును స్వాధీనపఱచుకొనవలెను. గడిబిడ పడగూడదు. కంగారు పడువాడు తన కర్తవ్యమును గూడ మఱచిపోగలడు. ఉరిత్రాటిని నెమ్మదిగా ఊడదీసికొనవలెను. తొందఱపడినచో ఉచ్చు ఇంకను బిగిసి ప్రాణాంతమును కలుగజేయగలదు.

కనుకనే గీతాచార్యులు సాధకుని ఉద్దేశించి 'శనైః శనైః' (మెల్లమెల్లగా) అని ఉపదేశించిరి. కొందఱు తీవ్రవైరాగ్యముచే ప్రేరితులై అంతయును వదిలిపెట్టి ఒక్క పర్యాయము అమాంతముగ మోక్షమునకు గంతువేయవలెనని తలంచి, తుదకు తన మనస్సును జయింపనేరక, దేహమును మాత్రముఉపవాసాదులచే క్షోభపెట్టి ఉభయభ్రష్టతను బొందుచున్నారు. అది చూచియే శ్రీ కృష్ణమూర్తి 'సాధకుడా! ఒక్కొక్క నియమమును ఆచరణలో పెట్టుకొనుచు, తొందరపడక, మనస్సును ప్రశాంతముగ లొంగదీసికొనుము' అని హితము చెప్పిరి. ○○

---

Laugh and the world laughs with you.
Weep, you have to weep alone.
నవ్వినచో ప్రపంచమంతయు నీతోబాటు నవ్వును.
ఏడ్చినచో నీ వొక్కడవే ఏడ్వవలసివచ్చును.

# కాలచక్రము

## శ్రీ అన్నవరపు నారాయణమూర్తి గారు

(గుంటూరు)

1. సిరిసంపదలతో తులతూగుతున్నానని సంబరపడకు
పరోపకారమునకు ఉపయోగించుటలేదని వ్యథచెందుము
రాజభోగములను అనుభవించుచున్నానని గర్వపడకు
కాలచక్రము తిరిగినదంటే నీ బ్రతుకు బానిసని గ్రహింపుము

2. మేడలు మిన్ను తాకునట్లు నిర్మించితినని పొంగవలదు
దురదృష్టము అనే పెనుగాలితాకిడికి అది ఏ పాటి అని తలంచుము
ప్రకృతిలోని ప్రతి అందము నీకు దాసోహమని అనుకోకు
భయంకర భూకంప ప్రవాహములో నీవు కేవలం మట్టిబొమ్మ
అని ఎరుంగుము

3. అందాలు వెదజల్లే నూతనత్వం తెచ్చితినని మురిసిపోకుము
భగవంతుడు సృష్టించిన ప్రకృతియందు నీ క్రియ అల్పమని
విశ్వసింపుము
ప్రకృతిని జయించినానని ఒడలు మరిచి గర్వించకు
ప్రకృతికి బానిసగా వున్నావని సిగ్గుచెందుము.

4 భగవంతుడిచ్చిన బుద్ధితో ధర్మమార్గము తప్పక
ఉపనిషత్తులలో వర్ణించబడిన సత్యమహిమ తెలుసుకొని
శాంతము, సహనము అనే చక్రముల సాయంతో
సహనం, నీతి అనే గుర్రాల సాయంతో నీ బ్రతుకు పయనం
సాగించుము
ఇష్టి కలిగిననాడు కాలచక్రము నీకు లోబడును!
ఆనాడే నీవు వాటి అన్నింటికి అతీతుడవౌతావు! OO

ఫిబ్రవరి 1993

# కర్షకుని కథ

## శ్రీ బోధచైతన్య గారు

**ఒ**క ధనికుని ఇంటికి కన్నంవేసి చోరులు విలువైన వస్తువులను, ధనాన్ని తీసుకొని ఒక పొలం గట్టుకు వెళ్లి పంచుకొని అక్కడ్నుంచి వెళ్లిపోయారు. తొందరవల్ల ఒక వేయి రూకల సంచిని వారు అక్కడ జారవిడిచారు. కొంతసేపటికి తెల్లవారింది. ఆ పొలాన్ని దున్నడానికి ఒక కర్షకుడు వచ్చి పనిలోకి దిగాడు.

ఆనందుడు వెంటరాగా బుద్ధుడు ఆ పొలం గట్టుమీద నడచివెళ్తూ ఆ సంచిని చూచాడు. "ఆనందా ఇటు చూడు ఈ విషసర్పాన్ని" అన్నాడు.

"అవును బుద్ధదేవా! నిజంగా చాలా విషం వున్న సర్పం ఇది" అన్నాడు ఆనందుడు.

ఈ సంభాషణ విన్న రైతు వారిద్దరూ అక్కడ్నుంచి వెళ్ళిపోయాక కుతూహలంతో వెళ్ళి చూచాడు. అక్కడ విషసర్పం లేదు. ధనం సంచి వుంది. పరమానందంగా దాన్ని తీసుకొని ఒక పొద దగ్గరకు వెళ్ళి దాచిపెట్టి మళ్ళీ తన పనిలో నిమగ్నమయ్యాడు.

దొంగతనం జరిగిన ఇంటి యజమాని కొందరిని వెంటబెట్టుకొని దొంగలను పట్టుకొనే ప్రయత్నంలో అడుగుజాడలు, వారూ వీరూ చెప్పిన సమాచారం ఆధారంగా ఆ పొలం దాకా వచ్చాడు. అక్కడ గనిమనుండి అడుగుల గుర్తులు పొద వరకు వుండడం కనిపెట్టి ఆ పొదను శోధించి చూచాడు. ధనం సంచి కనపడింది. ఆ కర్షకుడే దొంగ అని నిర్ణయించి అతణ్ణి బంధించి రాజు ముందు నిలబెట్టారు. కర్షకుడికి మరణశిక్ష పడింది.

రాజభటులు అతణ్ణి వధ్యశాలకు తీసుకొనిపోతుండగా అతడు మాటి మాటికి "ఆనందా ఇటు చూడు ఈ విషసర్పాన్ని. అవును బుద్ధదేవా నిజంగా చాలా విషం వున్న సర్పం ఇది" అనడం మొదలుపెట్టాడు.

రాజభటులకేమీ అర్థంకాలేదు. అతణ్ణి అడిగినా ఏమీ చెప్పడంలేదు. ఏడుస్తూ మళ్లీ అదే సంభాషణ వల్లించడం మాత్రం మానలేదు. రాజుగారి ముందుకు మళ్లీ అతణ్ణి తీసుకొనిపోయి అతని వింత ధోరణిని వివరించారు. రాజుగారి ప్రశ్నకు కూడా అతడు పిచ్చిగా ఆ సంభాషణే పలుకుతున్నాడు. రాజు ఆలోచించి ఆ కర్షకుణ్ణి వెంట బెట్టుకొని బుద్ధుడున్న విహారానికి వెళ్లాడు.

బుద్ధునితో మాట్లాడిన తరువాత ఆ కర్షకుడు దొంగ కాదని తెలిసి అతణ్ణి వదలిపెట్టి బుద్ధునితో "మీ సాక్ష్యం లేకపోతే అతనికి ప్రాణాలు దక్కివుండేవి కావు" అన్నాడు.

అప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

—ధర్మపదం 5–8

ఏ పని చేసిన తరువాత ఆ పని ఇచ్చిన ఫలితానికి పశ్చాత్తాపంతో తపిస్తూ కన్నీళ్ళు నిండిన ముఖంతో ఏడుస్తూ వుండవలసివస్తుందో అట్టి పని సరియైన పనిగా వుండజాలదు. ○○

## అధర్మ నివారణోపాయము

**సర్వమాత్మని సంపశ్యన్నాధర్మే కురుతే మనః**
**తథా హి త్వం విశుద్ధాత్మా స్వదేహం ఛేత్స్యసే కథమ్.**

**సర్వము ఆత్మస్వరూపమేయనియు, ప్రతిజీవియు తనవంటి ఆత్మ రూపమే కలిగియున్నదనియు తెలిసికొనువాడు ఇక అధర్మమెట్లు చేయగలడు? ఒక ప్రాణినెట్లు బాధింపగలడు? అంతయు తన స్వరూపమే అయియుండ ఇక ఇతరులను బాధించుటద్వారా తన స్వరూపమునకే అపకార మెవడైన తెచ్చుకొనునా? కావున అట్టి సర్వాత్మ భావము కలవాడెన్నటికిని పరులను బాధింపడు, అధర్మము చేయడు. అధర్మనివారణకు ఆత్మవిజ్ఞానము చక్కని ఉపాయము!**



జయ జయ సీతారాం । జయ జయ మోహనరాం
జయ జయ పట్టాభిరాం । జయ జయ జానకిరాం.

2. శ్రీరామ జయరామ జయ జయ రామా
జయ జయ రామ జానకి రామా
జయ జయ రామ జయ సీతారామా
అయోధ్యరామా ఆనందరామా
దశరథరామా జగదభిరామా
పావనరామా పావననామా
సీతారామా శ్రితగుణధామా
దశముఖసంహర దశరథరామా
దశరథరామా రణబల భీమా.

3. భజరే శ్రీరామం । మానస భజరే శ్రీరామం
సీతారామం । చిన్మయధామం
శ్రీ తులసీదళ । శ్రీకరధామం
శ్యామలగాత్రం । సతత చరిత్రమ్.

4. రామరాఘవ రామరాఘవ । రామరాఘవ పాహిమామ్
కృష్ణకేశవ కృష్ణకేశవ । కృష్ణకేశవ రక్షమామ్.

5. అయోధ్యవాసీ రామనమో । రఘుకులదీపక రామనమో
దశరథనందన రామనమో । భరతాగ్రజ శ్రీరామ నమో
సీతావల్లభ రామనమో । తాటకాంతకా రామనమో
వనవాసప్రియ రామనమో । భరతానుగ్రహ రామనమో
శబరీపలాశ రామనమో । కబంధసంహర రామనమో
హనుమత్సేవిత రామనమో । వాలివిమర్దన రామనమో
వానరసేవిత రామనమో । రాక్షసహరణా రామనమో
సామగానప్రియ రామనమో । భూపాలక శ్రీరామనమో
దుర్జనభంజన రామనమో । శ్యామసుందర రామనమో
హరిగోవిందా రామనమో । కనకాంబరధర రామనమో
ఓంకారాత్మక రామనమో । పాలయ మాం శ్రీరామ నమో
నమోనమో శ్రీరామనమో । రామనమో జయ రామ నమో

# గీతావాహిని



## అచంచల భక్తిచే ఆత్మజ్ఞానము

తమోగుణ, రజోగుణ, సత్త్వగుణములలో జీవుడు ఒక్కొక్క గుణమును దాటుచు ముందునకు సాగిపోవలెను. జీవిత మెల్లపుడును ప్రగతిశీలమై యేయుండ వలెను. గాని స్తబ్ధముగ నుండరాదు.

A rolling stone gathers no moss

'ద్రొళ్ళుచుండు రాతికి పాచిపట్టదు' అను సామెత ననుసరించి నిరంతర సాధనచేయువానికి అజ్ఞానమాలిన్యము అంటుకొనదు. జీవితమొక పరిశోధనశాల (laboratory or research institute). ఆత్మవికాసమునకు చేయదగిన సాధనలన్నింటిని ఇచట చేయవలెను. మనస్సునకు మెరుగుపెట్టవలెను. ఇంతవరకు ఎన్నియో జన్మలు గడచినవియనియు, ఇప్పుడు జాగ్రత్త వహించనిచో మున్ముందు ఇంకను ఎన్నియో గర్భనరకములను పొంద వలసియుండుననియు మనుజులు జ్ఞప్తియందుంచుకొందురుగాక!

కావున వివేకవంతుడు ప్రయత్నపూర్వకముగ ఈ దీర్ఘసంసారయాత్రను ఈ జన్మతో అంతమొందించవలెను. అట్లు అంతమొందించుటకు వలసిన శక్తి సామర్థ్యములను, ధైర్యస్థైర్యములను, విజ్ఞానమును ప్రసాదించవలసినదిగా సర్వేశ్వరుని ప్రార్థించవలెను. ఏలయనగా స్వప్రయత్నముతోబాటు భగవత్కటాక్షమును గూడ జోడించవలెను. అపుడు సాధనలన్నియు నిరాటంకముగ జరిగిపోవ ఈ జన్మయే అంతిమజన్మ కాగలదు.

నిష్కల్మషమై అవ్యభిచారమై అనన్యమైనట్టి భక్తితో భగవంతుని ప్రార్థించువారు, సేవించువారు వారి కరుణకు తప్పక పాత్రులు కాగలరు. అత్తటి వారు చేయు సాధనలయందు దైవసహాయము (Divine help) మిక్కుటముగ లభింప అచిర కాలములోనే వారు పూర్ణాద్వైతస్థితి నధిరోహించగలరు. ఇవ్విషయమై శ్రీకృష్ణుని వాక్యముల నాలకింపుడు–

(తరువాయి 39వ పేజీలో)

దేవుడు ఒకడే. ఆతడే నిరాకార సచ్చిదానందపరమాత్మ. ఆ పరమాత్మయే ధర్మోద్ధరణ కొఱకు సాకారరూపుడై లోకమున అవతరించుచున్నాడు. ఆ పరమాత్మయే శివుడు, ఆ పరమాత్మయే విష్ణువు. శివకేశవులలో కించిత్తైనను భేదములేదు. కాని శైవులలో, వైష్ణవులలో కొందఱు 'తమ మతమే గొప్పది'– అని వాదించుకొనుట, కలహించుకొనుట కానుపించుచున్నది.

మతములన్నియు భగవంతుని చేరుటకు భిన్న భిన్న మార్గములేయగును. ఎవరి సంస్కారమును బట్టి, మనస్తత్త్వమును బట్టి ఆయా దేవుళ్ళను, దేవతలను అర్చించవచ్చును. ఒకరు మఱియొక మతమువారిపై విద్వేషమును ప్రకటించుట సమంజసము కాదు.

ఒక ఊరిలో ఒక శైవుడు తన పూజామందిరములో శివుని పూజించుచు, ధూపము సమర్పించునపుడు ఆ గదిలోనే పైన అటకమీద తన పూర్వీకులెవరో పెట్టియున్న విష్ణువుయొక్క విగ్రహమునకు అది సోకగూడదని తలంచి దానిని మూసివేసెనట! ఇంతకుమించిన మతమౌఢ్యము మఱియొకటి కలదా?

జనులిట్టి సంకుచితభావములను త్యజించి, మతమౌఢ్యమును విడనాడి, దేవుళ్ళందఱు ఒకే పరమాత్మస్వరూపులని భావించుచు, వారి వారి దైవమును వారు శ్రద్ధాభక్తులతో ఆరాధించుచు, పరమతము యెడల, పరప్రాణి యెడల సద్భావము కలవారై ప్రపంచ శాంతికి, తమ శాంతికి దోహదమును కలుగజేయుదురుగాక! ○○



# శ్రీశైలము

## ఓంప్రకాశ్

కర్నూలు జిల్లా-నందికొట్కూరు తాలూకాలో నల్లమల కొండలున్నాయి. ఆ కొండలపైన ఒక శివక్షేత్రముంది. అదే శ్రీశైల మల్లికార్జున క్షేత్రము. ఈ క్షేత్రాన్ని శ్రీపర్వతం- శ్రీగిరి- శ్రీనగరం అని కూడా అంటుంటారు. శ్రీశైలమే ప్రసిద్ధ నామం. ఇది సముద్ర మట్టానికి 1500 అడుగుల ఎత్తున దుర్గమమైన పర్వతాల మధ్యలో వుంది. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన శ్రీ మల్లికార్జునస్వామి లింగం ఇక్కడుంది. ఇది శక్తిపీఠాలలో ఒకటి. ఇక్కడ సతీదేవి మెడ పడిందంటారు. ఆ చోట భ్రమరాంబ దేవీ ఆలయముంది. వీరశైవ మత పంచాచార్యులలో ఒకరైన శ్రీ పండితారాధ్యుల వారు మల్లికార్జున లింగంనుండే ఉద్భవించారంటారు.

మన్మాడ్-కాచీగూడ మార్గంలో సికిందరాబాదు స్టేషను నుండి ద్రోణాచలం వరకు ఒక దారి వుంది. ఈ దారిలో కర్నూలు స్టేషన్‌లో దిగాలి. అక్కడినుండి 77 మైళ్ల దూరంలో శ్రీశైలం వుంది. బస్సులు వెళతాయి.

మచిలీపట్నం-హుబ్లీ లైనులో నంద్యాల స్టేషన్‌లో దిగి కూడా శ్రీశైలం వెళ్లవచ్చు.

బస్సులు ఆత్మకూర్ వరకు వెళతాయి. అక్కడినుండి నాగాహుటీ 12 మైళ్ళు. ఆ మీద 31 మైళ్ళు వెళితే శ్రీశైలం వస్తుంది. 'శివరాత్రి' పర్వంలో బస్సులు నాగాహుటీ నుండి 25 మైళ్ళు ముందుకు వెళుతుంటాయి. మిగిలిన 6 మైళ్ళ

పర్వతారోహణం, నడచి వెళ్ళాలి.

ఇప్పుడు దోరణాల అనే ప్రాంతంనుండి శ్రీశైలం పైకి రోడ్డు నిర్మించి యున్నారు. బస్సులు పైకి వెళుతుంటాయి. యాత్రీకులు ఈ సౌకర్యాన్ని వినియోగించుకోవచ్చును శ్రీశైలం పైన ఘోరమైన అరణ్యం వుంది. పులి-చిరుత-ఎలుగు లాంటి క్రూరమృగాలెన్నో వుంటాయి.

శ్రీశైలం పైనున్న దేవాలయాలలో ప్రధానమైనవి శ్రీ మల్లికార్జున దేవాలయం, శ్రీ భ్రమరాంబికా దేవాలయం. పర్వతంపై సమతల ప్రదేశంలో కోటద్వారం-గోడలు కనబడతాయి. అవి చాలా మందంగా-ఎత్తుగా వుంటాయి. నల్లని ఆ రాళ్ళపై అనేక విగ్రహాలు చెక్కి, తమ శిల్పకళా నైపుణ్యాన్ని ప్రదర్శించి ఉన్నారు. ఆ కోటకు ఎనిమిది మూలల్లో అష్టభైరవులున్నారు. పడమటివైపున పంచమఠాలున్నాయి.

కొద్ది దూరం ముందుకు వెళితే, ఆలయ ప్రాకారం కనబడుతుంది. ఆలయ ప్రాకారంలో తూర్పు-ఉత్తర-దక్షిణాలలో గోపురాలున్నాయి. కుడ్యాలు శిల్పకళతో ఆకర్షిస్తుంటాయి. దేవాలయాల్లో ఒకదానిలో మరొకటిగా రెండు ఆవరణలున్నాయి. ఒక ఆవరణలో యాత్రికుల బసలు, భ్రమరాంబాలయం కనబడతాయి.

ప్రాకారానికి బయట మూడు కొలనులున్నాయి. భ్రమరాంబిక గుడి చాలా చిన్నది. స్తంభాలపై శిల్పాలు చెక్కారు. దుర్గాదేవి మూర్తులు ఎన్నో కనబడతాయి. ఇది చాలా ప్రాచీన దేవాలయం.

రెండవ ఆవరణంలో శ్రీ మల్లికార్జునస్వామి దేవాలయం వుంది. దేవిని బ్రాహ్మణులు అర్చిస్తే, స్వామిని జంగములు అర్చిస్తారు. ఈ గుడి కూడా చిన్నదే. గర్భగుడిలో మల్లికార్జున లింగముంది. ఆలయానికి ముందు మూడు వరండాలున్న మంటపమొకటుంది. దీనిలో కొన్ని రాతి గుహలున్నాయి. మంటపం నాలుగు మూలల్లో-నడుమ నంది విగ్రహాలున్నాయి. ప్రధాన దేవాలయానికి ఎదురుగా, తూర్పున రెండు మంటపాలున్నాయి. ఒకదానిలో పెద్ద నంది విగ్రహముంది. ఎన్నో శిలా శాసనాలున్నాయి.

ఆలయానికి పడమట అందమైన శిలా బలిపీఠముంది. ఈ బలిపీఠానికి పడమట 'వసంత మండప'ముంది. భ్రమరాంబ-మల్లికార్జున విగ్రహాలను ఇక్కడికి ఊరేగింపుగా తెప్ప తిరునాళ్ళకు తీసికొని వస్తారు.

ముఖ మండపానికి తూర్పున సహస్రలింగ దేవాలయముంది. మూడు పడగల నాగపీఠం మీద ఈ లింగం వుండటం చూస్తాం.

శివరాత్రినాడు పెద్ద ఉత్సవం జరుగుతుంది

## ఇతర దృశ్యాలు

శ్రీశైలంలో మల్లికార్జున-భ్రమరాంబికల ఆలయాలేకాక, భీముని కొలను-పాతాళగంగ-ఇతర శివాలయాలు ఎన్నో చూడదగినవి వున్నాయి.

క్షేత్రానికి నాలుగు మైళ్ళ దిగువ-రెండు కొండల నడుమ-అగాధమైన లోయలో భీముని కొలనుంది. భీముడు తన గదతో కొట్టి దీన్ని నిర్మించాడట. ఇది రమణీయ దృశ్య సమన్వితం.

స్వామికి రెండు మైళ్ళ దూరంలో, లోయలో కృష్ణా నది ప్రవహిస్తుంది. దానినే 'పాతాళగంగ' అంటారు. దీనిలోని స్నానం, సర్వపాపహరమంటారు.

ఈ క్షేత్ర పరిసరాలలో హాటకేశ్వరం-బిల్వవనం-ఆలంపురం-మహానంది మొదలగు పుణ్యస్థలాలను చూడవచ్చు.

## స్థల కథ

భూ ప్రదక్షిణ పందెంలో గణపతి గెలవగా, కుమారస్వామి కోపించి, కైలాసాన్ని వదలి శ్రీశైలంపైకి వచ్చాడు. కుమారుని వియోగం భరించలేక పార్వతీ-పరమేశ్వరులు కూడా శ్రీశైలానికి విచ్చేస్తారు. కాని కుమారస్వామి, అక్కడనుండి మరో పర్వతం పైకి వెళ్ళిపోతాడు. శ్రీశైలంలో పరమేశుడిని 'అర్జును'డని, పార్వతిని 'మల్లిక' అని అంటారు. అందుకే ఈ క్షేత్రానికి మల్లికార్జున క్షేత్రమని పేరు వచ్చింది.

శ్రీశైల శిఖరం చూస్తే, పునర్జన్మ వుండదట! OO

**Obedience to the Guru without questioning, and strict observance of Brahmacharya-This is the secret of success.**

**అకుంఠిత గురుభక్తి, దృఢమగు బ్రహ్మచర్యవ్రత పరిపాలన- అను ఈ రెండును విజయమునకు కీలకములై**

# శ్రీ వివేకానందస్వామి

ప్లేగు (మహామారి) గాని, కరువుగాని ఎచటెచట సంభవించునో ఎచటెచట జనులు దురవస్థలపాలగుచుందురో, అచటచటకు మీరందఱును వెళ్ళి వారి దుఃఖములను ఉపశమింపజేయుడు. ఆ ప్రయత్నమున మీరొకవేళ మృతినొందినను, దానివలన తరిగిన దేమియు లేదు. ప్రతిదినము ఎందఱో పుట్టుచున్నారు. చచ్చుచున్నారు కీటకములవలె; దానిచే ఈ విశాల ప్రపంచమున అణుమాత్రమైన భేదము కలుగుచున్నదా? చావు ఎవరికైనను తప్పదు. కావున ఒక మహోన్నతాదర్శముకొఱకేల చావరాదు? గొప్ప ఆదర్శము గలిగి జీవించుట, అట్టి ఆదర్శమునకై మరణించుట శ్రేయస్కరమై యున్నది. పరప్రాణికి ఉపకారము చేయుటయను ఈ మహత్తర ఆదర్శమును మీరు ఇంటింటికిని వెళ్ళి బోధింపుడు. దానిచే మీరు మేల్కాంచుటయేకాక, దేశమునకున్ను గొప్ప మేలు చేసినవారగుదురు. మనదేశము యొక్క భావి శ్రేయస్సంతయు మీ మీదనే ఆధారపడియున్నది.

2. విధి విపరీతమై విషమపరీక్షాశ
తంబుల హింసింప దలచుగాక,
ప్రకృతి యంతయుఁ గనలి నిన్ గ్రాఁచుగాక
ఆత్ముఁడా! నీవు నీదు దివ్యత్వ మెఱిఁగి
క్రోవనాగక, ఇటు నటు తొలఁగక కలఁత
సైచి గమ్యైక దృష్టివై సాగుమయ్య!

3. మిత్రుడా! సమస్త శక్తియు నీయందే కలదు. వీరుడా! నీ యీ మహత్తర ఆత్మ స్వభావమును ప్రత్యక్షము చేసికొనుము. అత్తఱి ఈ విశ్వమంతయును నీకు పాదాక్రాంతమగును. వాస్తవముగ యాత్మయే సర్వత్ర కలదు కాని ప్రకృతి కాదు. దేహమే తామనుకొను పామరులే "మేము దుర్బలులము, దుర్బలులము!" అని విలపించుచుందురు. మహాధీరత్వము, అఖండశక్తి సామర్థ్యములు, అపరిమితోత్సాహము మనకిపుడు కావలసియున్నవి. వెనుకచూపు పనికిరాదు. ముందునకే చనుడు!



# ఆధ్యాత్మిక కథలు

ఒకానొక పట్టణమున ఒక వ్యక్తి కలడు. అతడు పరమ లోభి. అతనికి కావలసినంత ధనమున్నప్పటికిని లోభత్వమువలన దానిని తాను స్వయముగ వినియోగించడు సరికదా, ఇతరులకు దానధర్మములను కూడ చేయడు. తన సంపద ఎక్కడ ఖర్చయిపోవునో అని తలంచి పాత వస్త్రములనే ధరించును మరియు తన కుటుంబస్థులచే సామాన్య దుస్తులనే ధరింపజేయును.

ఆ లోభి భుజించు ఆహారము కూడ చవకయైనదే. పిసినిగొట్టుతనము వలన అతడు ఆరోగ్యకరమైన, బలవర్ధకమైన, నాణ్యమైన ఆహారమును స్వీకరింపడు. ఏలయనగా శ్రేష్ఠమైన, రుచికరమైన భోజనమును తయారుచేసుకొనినచో తన ధనమంతయు వృధా అయిపోవునేమో అను బెంగ అతనిని బాధించును. అతడు తన ఇంటిలో కొంత నెయ్యిని ఒక పాత్రలో వేసికొనియుంచుకొనును. ఆ నేతి పాత్రను దూరముగ దూలమునకు తగిలించి దానికి చూపించుచు రొట్టెముక్కను తినుచుండును. అన్నమును స్వీకరించునపుడు దగ్గరగా కాకులు వ్రాలినచో వాటిని చేతితో తరుమడు. ఒకవేళ చేతితో కాకులను అదలించినచో చేతికి అంటుకొనిన ఎంగిలి మెతుకులు క్రిందపడుటచే ఎక్కడ కాకులు వాటిని తినునో అనియే అతడు చింతించుచుండును. "ఎంగిలి చేతితో కాకులను కూడ కొట్టడు" అను సామెత ఆ లోభికి పూర్తిగ వర్తించును.

ఎవరైన బీదవారు వచ్చి, "అయ్యా! పేదవాడిని. ఆకలిగా వున్నది. ఒక ముద్ద అన్నము పెట్టుడు" అని ప్రార్థించినచో, "పని చేసుకొని బ్రతుకలేని సోమరులు, ఎవరెనా పెడితే తేరగా తినిపోతూంటారు. మీకు వేరే పనీ

పాటూ లేదు. నన్ను విసిగించకుడు. పో, పో" అని కసరుకొని వారిని పంపివైచును.

పూజా సమయములో అతడు నైవేద్యమిడుట ఆశ్చర్యకరముగ వుండును. "మనము నివేదన చేయు పదార్థములను భగవానుడు స్వీకరించునా! ఏమి? పత్రమో, ఫలమో సమర్పించిన చాలును. వాటిని కూడ మానసికముగ సమర్పించిన చాలదా?" అని తలంచుచు ఆ లోభి ఒక క్రుళ్ళిపోయిన అరటిపండును, కొన్ని నాసిరకపు పుష్పములను మానసికముగ భగవంతునకు సమర్పించును.

అతనిలో లోభత్వము ఎంతగా పాతుకొనిపోయినదో గమనించుడు! ప్రపంచములోని సమస్త ఆహారపదార్థములను, సకల సంపదలను భగవంతునకు మానసికముగ సమర్పణ చేసినచో అతడు నష్టపోవునది ఏమియు లేదుగదా! పైపెచ్చు గొప్ప ప్రయోజనము చేకూరును. మనస్సులో కూడ శ్రేష్ఠమైన నైవేద్యమిడుటకు ఆ లోభికి బుద్ధి కలగలేదు.

నీతి : నరక ద్వారములలో లోభము ఒకటి. లోభగుణము వలన మనుజుడు సంకుచిత హృదయముగలవాడై శాంతి సుఖములను నోచుకొనజాలడు. త్యాగమువలన అమృతత్వము, పరమానందము జీవునకు లభించగలవు. మానవుడు తనకున్న సంపదలను ధర్మకార్యములందు, దైవకార్యములందు సద్వినియోగపరచుటను అలవరచుకొనవలెను. లేనిచో అది రాజుయొక్క పాలుకాని, దొంగయొక్క పాలుకాని, అగ్నికి ఆహుతిగాని కాగలదు. ఆ ధనము వలన అతనికి ఇహలోక, పరలోక ప్రయోజనములు కలుగజాలవు.

కనుక జనులు లోభము, కామము, క్రోధము మొదలగు దుర్గుణములను దూరీకరించి ప్రేమ, దయ, కరుణ, భూతసేవ, దానము, ధర్మము మున్నగు మహోన్నత సద్గుణములను అలవరచుకొని హృదయశుద్ధిని తద్వారా బ్రహ్మానందమును అనుభవించవలెను. విశాలదృక్పథము కలిగి తనయొక్క సంపదలను ఇతరుల కొరకు కూడ వినియోగించుచు, పరోపకార బుద్ధి కలిగి మనుజులు భగవత్కృపకు పాత్రులు కావలెను. సంకుచిత బుద్ధిని, లోభత్వమును, స్వార్థపరత్వమును పూర్తిగ విడనాడవలెను.

# సద్గురు సుభాషితములు

## శ్రీ మహర్షి మలయాళస్వాములవారు ఇట్లు బోధించిరి.

1 వరివిత్తనములు మొదలగునవి నారువేసిన తరువాత కాలపక్వమునుసరించి యేలాగున నచ్చోటునుండి తీసి దూరముగ నాటుదురో, అట్లు నాటకపోయిన యే వృక్షములున్ను పైర్లున్ను బాగుగా పెరిగి పూర్ణఫలము నివ్వజాలవో, మొదట నారువేసిన స్థలములోనే యుండినచో ఎట్లు కృశించి పూర్ణముగా పెరిగి సంపూర్ణ ఫలమును ఇవ్వజాలవో, ఆలాగున యెవండు గృహస్థాశ్రమములో నందరితోను గూడి మొట్టమొదట యుండినను వైరాగ్య తరుణకాలము వచ్చునప్పుడు ఏకాంత స్థలములోనుండి బ్రహ్మనిష్ఠచేయనిచో హృదయము వికసించి పూర్ణ ప్రబోధముగలిగి బ్రహ్మానందామృత ముక్తిఫలమును పొంద జాలడు. ఇది మొదటి కొబ్బరి, నిమ్మ మొదలగు విత్తనములున్ను, వరిపైరు మొదలగు విత్తనములున్ను నారువేయువారికి బాగుగా తెలిసిన విషయమే.

2. సంస్కృత విద్య నభ్యసించుచుండు సోదరులారా! మీరు విద్యావిద్యలను రెండు ప్రవాహముల మధ్యయుండు అతి సూక్ష్మమయిన యొక కట్టమీద పోవుచున్నారు. అనగా మురికినీటియొక్కయు శుద్ధజలముయొక్కయు నడుమనుండు సన్నని గట్టుమీద ప్రయాణము జేయువారివలెయుంటున్నారు. దీనికే వామ, దక్షిణ మార్గములని శాస్త్రములలో పేర్కొనియున్నారు. వామ మార్గమునకైన లేక దక్షిణ మార్గమునకైనా జారిపడిపోవచ్చును. అది విద్యా మార్గమయినచో అమృతత్వమును, అవిద్యామార్గమయినచో మృత్యువునున్ను పొందగలరు. కావుననే "విద్యయాఽమృత మశ్నుతే" అని వచించుటకు కారణము.

3. సోమరితనము మర్త్యుని, నీచస్థితిలోని కిన్నీ సోఽహంపరత్వము, ఉచ్చస్థానములోనికిన్నీ ప్రవేశపెట్టును.

4. అనాత్మ వస్తువులగు దేహేన్ద్రియములనుండి ఆత్మను ఎట్లు వేరుపరిచి

చూడవలయునో ఆత్మ ఎట్లు సూక్ష్మమైనదో ఈ క్రింది తెలిపెద. మీలో చాలా మందిన్ని బంగారు పనిచేయువారి స్థానమును చూచియుందురు. వారు స్వర్ణమును కరుగజేయు పాత్రలోగల బూడిదయు, సమీప ప్రదేశములలో యూడ్చిన మట్టి, దుమ్ము మొదలైనవియు ఒక్క స్థలమున భద్రపరచెదరు. దానిని కొనే వారు వచ్చి కొనెదరు. దానిని కొనినవారు కొన్నిసార్లు గాలించి గాలించి అడుగున పేరుకొనుచుండు సువర్ణాణువులను వేరుపరచి కరుగచేసెదరు. దానిని శుద్ధ బంగారునుగా తయారుచేయుదురు. అలాగున అనాత్మ స్వరూపమగు దేహేన్ద్రియములకు సాక్షియయిన ఆత్మను ధ్యానజ్ఞానములచే వేరుపరచి గ్రహింపనగును.

స్వంత దుకాణాదారులకు వ్యాపారస్థులు ఎంతకెంతకు వచ్చినను సంతోష మధికరించునేగాని విసుగుగలుగదు. కాని పూర్తి విశ్వాసము లేని గుమాస్తాలకు వ్యాపారస్థులు ఎక్కువ వచ్చిన విసుగు గలుగుచుండును. ఆలాగున నిజముగా ఆత్మశుద్ధి గలిగి లోకసేవయందుగాని, పరోపకారమందుగాని, దానధర్మాదుల యందుగాని ప్రీతిగలిగినవారికి లోకసేవగాని, పరోపకారముగాని, పుణ్యకర్మగాని, దానధర్మములను గురించిగాని యెంతమంది వచ్చినను యెంత పని గలిగినను విసుగుగలుగదు. అట్లుగాక నిజముగా, ఆత్మశుద్ధిలేకగాని, పేరుప్రతిష్ఠలకొరకు గాని, లేక ఇతరుల ప్రేరణచేతగాని ఎవరైతే పరోపకారముగాని, లోకసేవగాని, పుణ్యకర్మలుగాని, నిష్కామకర్మ యోగముగాని చేయువారుండిన జనులు ఎక్కువ వచ్చినపుడు అట్టివారికి విసుకున్నూ నిరాదరణము కానిపించును. చేయవలసిన పని సరిగా చేయకపోయెడు స్వభావమున్నూ గలుగును. వీరికి ఆత్మశుద్ధియు ప్రాణికోట్లలో దయయున్ను నిష్కామకర్మయోగ ప్రభావమున్ను ఇకను పూర్తిగా కలుగలేదని గ్రహించుకొనవచ్చును. ఆత్మశుద్ధియు ప్రాణికోట్లలో నిజమైన ప్రేమయు గలిగినవారైనచో పైజెప్పిన పవిత్ర కార్యములలో అంత కంతకు సంతోషమధికరించును. ఇదే దానికి గురుతు. ○○

---

Until there is the thirst one cannot get religion

[illegible]

# ఈశ్వర్

ఎవరైనా ఎంత గొప్పవారైనా ఎన్ని శక్తులు సంపాదించినవారైనా ఎంత ఎక్కువ అధికారంగలవారైనా ఏ లోకంలోనైనా, ఏ యుగములోనైనా, ఏ కాలంలోనైనా అపకారం, అహంకారం, మమకారం, దురహంకారం, దురాచారం, దుష్ప్రవర్తన మొదలగు రాక్షస గుణాలు గలిగియుండి హింసాత్మక చర్యలు సాగించేవారికి వినాశనము తప్పదు.

ఒక్కసారి చరిత్ర పుటలు తిరుగవేస్తే రావణ, దుర్యోధన, దుశ్శాసన, కంస, శిశుపాల మొదలగువారు సామాన్యులు కాదు. బాహ్యశక్తిలో అగ్రగణ్యులు. ప్రేమ, కరుణ, దయ, అహింస మొదలగు సద్గుణములు లేని కారణము చేత దైవశక్తితో కనెక్షన్ కోల్పోయిరి.

బలుబు ఎంత పెద్దదైనను, పొడుగైనను, లావుదైనను కరెంటును ఆశ్రయించనిదే ప్రకాశమును, వెలుగును, కాంతిని వెదజల్లలేదు. భగవంతుడు ఒక మహావిద్యుత్ ట్రాన్స్‌ఫారంవంటివాడు. అన్ని జీవరాసులు బలుబులవంటివారు. బలుబులవంటి జీవులు కరెంటువంటి భగవంతునితో కనెక్షన్ గలిగియుండాలి. అప్పుడే వారి అనుగ్రహం చే, ఆశీర్వాదం చే శాంతి సుఖములు లభించగలవు. వారి అనుగ్రహం పొందాలంటే తప్పనిసరిగా వారి సూచనలను, సలహాలను పాటించితీరాలి! ఆ సూచనలే "భగవద్గీత, భారత, భాగవత, రామాయణ, ఉపనిషత్‌లవంటి గ్రంథములు. వాటిలో సూచించిన సూత్రములు, సిద్ధాంతములు పాటించి ఆచరించి-అనుష్ఠించి సత్ఫలితములు పొందవచ్చును.

[illegible]

"ధన, జన, బల, యౌవనాది ఒ[illegible] ఎ[illegible] ఏ మురిసిపోయి విర్రవీగవద్దు" అని ఆదిశంకరులు సెలవిచ్చిరి. కాల మనోబలములలోకెల్ల బలమైన, భద్రమైన, భవ్యమైన, చక్కనైన [illegible] అహర్నిశములు పాటుబడి దాన్ని సాధించి, ఈ జన్మనే తుది జన్మగ, చివరి జన్మగ చేసుకొని జీవితమును సమాప్తం చేయువాడే నిజముగ జీవించినవాడు. ○○

# ప్రశ్నోత్తర వేదిక ?



## సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

(తిరుపతి)

**ప్రశ్న :** *భగవంతుణ్ణే నమ్మి, ఆయనమీదనే అన్ని భారాలను మోపి, మన కర్తవ్యాన్ని మనం ఆచరిస్తే మోక్షం కలుగుతుందా?*

**జవాబు :** తప్పక కలుగుతుంది. నీవు స్వతంత్రుడివి కాదు. దేవుని దయ లేందే నీ ప్రయత్నం ఏదీ నెరవేరదు. కనుక ఆయన్ను అన్ని విధాలా శరణు పొందు. నీ మనస్సును ఆయన కర్పించు. నీ కర్తవ్యాన్ని నిర్వహించు. ఆయన అనుగ్రహం పొందడానికి అర్హతను సంపాదించు. ఆయసదయవల్ల శాంతిని, శాశ్వతమైన పరమపదాన్ని పొందుతావు. నేను చేస్తున్నాననే అహంకారాన్ని వదలుకో.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్। (భగవద్గీత 18-62)

**ప్రశ్న :** *కొన్ని తత్త్వశాస్త్రాలు, "చెప్పినదానిమీద విశ్వాసముంచాలిగాని ఎదురు ప్రశ్నించరాదం"టాయికదా! మన వేదాంతం గురువు చెప్పినదాన్ని తు.చ. తప్పకుండా గుడ్డిగా నమ్మమంటుందా? లేక హేతుబలంతో విచారించి, నిర్ణయించుకొని, నచ్చిన పద్ధతిలో ఆచరించమంటుందా?*

**జవాబు :** అదే మన వేదాంతంలో వున్న విశిష్టత. గుడ్డిగా నమ్మమని, ప్రశ్నలు వేయవద్దని చెప్పేదికాదు మన వేదాంతం. సాధకుడికి స్వాతంత్ర్యం వుంది. అనుభవరూపంగా వాడికి నమ్మకం కలిగితేనే అలా ఆచరించమని మన తత్త్వ

# అమృత బిందువులు

కః కస్య పురుషో బన్ధుః
కిమాప్యం కస్య కేనచిత్
యదేకో జాయతే జన్తుః
ఏక ఏవ వినశ్యతి.

ఎవడు ఎవనికి బంధువు? ఎవనికి ఎవనివలన ఏది లభించుచున్నది? ప్రాణి ఒంటరిగనే పుట్టుచున్నది. మరల ఒంటరిగనే మృతినొందుచున్నది.

సర్వే క్షయాన్తా నిచయాః
పతనాన్తాః సముచ్ఛ్రియాః
సంయోగావిప్రయోగాన్తాః
మరణాన్తం చ జీవితమ్.

కూడబెట్టిన ధనాదులన్నియు కొంత కాలమునకు నశించిపోవుచున్నవి. పెద్దగా పెరిగినవి పతనమొందిపోవుచున్నవి. సంయోగములు వియోగములగుచున్నవి. జీవితము మరణముతో అంతమగుచున్నది. ○○

---

శాస్త్రవేత్తలు ఉపదేశిస్తున్నారు. ఎవరు ఎవరికి ఏ జ్ఞానాన్ని ఉపదేశించినా స్వానుభవంతో మంచి హేతువులతో దాన్ని విచారించి ఎలా చేయడం మంచి దనిపిస్తే అలా చెయ్యమని చెప్పారేకాని "నేను చెబుతున్నాను కాబట్టి నీవు చెయ్యి" అని అనలేదు. గీతోపదేశం చేసిన శ్రీకృష్ణపరమాత్మ కూడా అర్జునుడికి ఆ స్వాతంత్ర్యం ఇస్తున్నాడు. ఇది ఇతర తత్త్వశాస్త్రాలలో మృగ్యం.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్ గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు (భగవద్గీత 18-63)

○○

1. చంద్రునికంటె సూర్యుడు 4 లక్షల 65 వేల రెట్లు కాంతివంతముగ ఉన్నాడు.
2. ఈ ప్రపంచములో అన్నిటికన్న చిన్న జంతువు అమీబా. అన్నిటికన్న పెద్ద జంతువు తిమింగలం. దాని బరువు 150 టన్నులు.
3. ఒక దోమ ఒక్కొక్కసారి 100 గ్రుడ్లు పెట్టును. అనగా ఆ దోమకు సంవత్సరమునకు 3 కోట్ల 10 లక్షలమంది వారసులు ఉద్భవించుదురు.
4. 1988 సంవత్సరంలో భారత రైల్వేలు 2 కోట్ల 30 లక్షల టన్నుల పెట్రోలియం పదార్థములను 36 వేల టాంకు వాగనులద్వారా దేశమంతటికి రవాణా చేసినవి.
5. అట్లాంటిక్ సముద్రపు అడుగున మిక్కిలి పెద్ద పర్వతశ్రేణి కలదు. దాని పొడవు 10,000 మైళ్ళు, వెడల్పు 500 మైళ్ళు, సగటు ఎత్తు 10,000 అడుగులు.
6. అమెరికన్ సైన్యమందలి సార్జంట్ వాల్టర్ రాబిన్‌సన్ అను వ్యక్తి 1978 సంవత్సరంలో ఒక ప్రత్యేక రకమైన పాదరక్షలు ధరించి నడచుచూ ఇంగ్లీషు ఛానల్‌ను 12గంటల కాలములో దాటెను.
7. ప్లీనె ఎల్ వింగో అను అమెరికా దేశస్థుడు 1931–32 సంవత్సరంలో వెయ్యి మైళ్ళకు పైగా వెనుకకు నడిచి వెళ్ళెను.

OO



# వసిష్ఠ వాణి

# యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి–

పూర్వము హిమాలయ పర్వత ఉత్తర భాగమున కర్కటియను రాక్షసి నివసించుచుండెను. ఆమె అతిదీర్ఘకాయముగలది. కృష్ణవర్ణిని. విశాలదేహముగలదగుటచే క్షుదాశాంతికై ఆహారము సంతృప్తిగ లభింపమి అజ్ఞానులగు సమస్త ప్రాణులను భక్షింపనెంచి హిమవచ్ఛిఖరముపై ఏక పాదముపై నిలఁబడి వేయి సంవత్సరములు తీవ్ర తపంబొనర్ప ఆ పిదప బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా అంత నా కర్కటి 'జనులందు ప్రవేశించుటకై నేను లోహరహితమైన (రోగరూప) సూచికయు, లోహరూప సూచికయునగుదునుగాక!' అని కోరగా పద్మజుఁడట్లేయని చెప్పి, నీవు దుష్టజనుల శరీరములందు సూచీ (సూది) రూపమునఁ బ్రవేశించి వ్యాధిరూపిణివై బాధింతువు. ఆ (విషూచీ) రోగముయొక్క చికిత్సకై నేను మంత్రము చెప్పెదను వినుము.

"ఓం హ్రీం హ్రాం రీం రాం విష్ణుశక్తయే నమః
ఓం నమో భగవతి విష్ణుశక్తి...

అని మాంత్రికుఁడీ మహామంత్రమును తన కుడిచేతితో తన ఎడమచేతియందు వ్రాసి, ఆ ఎడమచేతితో రోగపీడితుని దేహమంతయు తుడవవలెను. నీవా మంత్ర ప్రభావమువే హిమవత్పర్వతమునుగూర్చి పరుగిడిపోయినట్లు మాంత్రికుఁడు మనంబున ధ్యానింపవలెను. మరియు ఆ రోగి చంద్రమండల మధ్యమునందు అమృతరసాయనములో మునిగియున్నట్లుగా జరామరణ బాధారహితునిగను, మనోవ్యథా శరీరజన్య

రోగములవలన గలుగు దుఃఖము ఆ రోగిని విడిచిపోయినట్లును మాంత్రికుడు చింతన చేయవలెను. ఈ విధముగ నెవడైన మాంత్రికుడు పరిశుద్ధుడై బాగుగ నాచమనము చేసి శాంతచిత్తముతో సర్వకార్యములను జేయునేని అపుడు నీవా రోగిని బాధింపక విడిచిపొమ్ము" అని బ్రహ్మదేవుఁడాజ్ఞాపించి అంతర్ధానమయ్యెను.

తదుపరి ఆ రాక్షసి క్రమముగ సూక్ష్మమై ద్వివిధ (లోహమయ, రోగరూప) సూచికా రూపమును బొంది జనుల హృదయములందు బ్రవేశించి బాధ గొలుపుచు నలుదెసల తిరుగసాగెను.

ఈ ప్రకారముగ ఆ కర్కటి బహుకాలము మనుజుల మాంసమును (సూచీ రూపమున) భుజించినను తృప్తిఁబొందకుండె. మఱియు నయ్యది తన స్వల్ప దేహమును జూచి మిగుల ఖేదమొంది తన పూర్వశరీరమును తిరిగి పొందు నిమిత్తము హిమవచ్ఛిఖరముపై 7 వేల సంవత్సరాలు ఉగ్రతపంబాచరించెను. దానిచే పాపము శమించి పవిత్రవతియు, బోధరూపిణియునాయెను. దాని తపస్సుచే జగంబంతయు ఉడికిపోవ అపుడింద్రుఁడు నారదుని యట్లగుటకు కారణమేమనియడుగ నారదు డంత ఆ కర్కటియొక్క వృత్తాంతమును సూచీ రూపమున నయ్యది యనుభ వించిన భోగములను అన్నిటిని వివరించి చెప్పెను.

ఇంద్రుఁడపుడు ఆ సూచికను వెదకుటకై వాయుదేవుని బంప, అతఁడు క్రమముగ జంబూ ద్వీపమున కేగి అట హిమవచ్ఛిఖరముపై నిశ్చలముగ తపంబొన ర్చుచున్న సూచికనుగాంచి ఆ వృత్తాంతమంతయు నింద్రునకెఱింగించెను. తదుపరి వేయి సంవత్సరముల యనంతరము బ్రహ్మదేవుఁడు ఆ సూచికవద్దకు వెళ్లి వరము కోరుకొమ్మనగా "నేను జ్ఞేయమగు ఆత్మను బొందితిని. సంశయములు శమించినవి, తృప్తినొందితిని, సత్యవస్తువును నేను; నాకు వరములతో నేమి పని. అసత్యవస్తువునేల కాంక్షింపవలె?" అని మనంబున చింతించుచుండ బ్రహ్మదేవుఁడు "నీ తపస్సు యొక్క ఫలమును నీవు బొందితివి. నీవు నీ పూర్వ శరీరమును బడసి అన్యాయపరులగు జీవులను మాత్రమే భక్షించుచు జీవన్ముక్తవై లోకమున చరించెద"వని చెప్పి వెడలి పోవ, అయ్యది క్రమముగ తన విశాల రాక్షసదేహము నొందెను.

అపుడట నాసీనమై 6 నెలలు ధ్యానమందుండి పిదప లేచి ఆహారము కొఱకై విచారించుచు న్యాయార్జితమైనదానినే భక్షింపవలెననియు అట్లుగాకున్న మరణమే శ్రేష్ఠమనియు తలంచుచుండ నింతలో వాయువు "నీవు మూఢులవద్దకు వెళ్ళి వారికి జ్ఞానమును బోధింపుము" అనెను. ఆ వాక్యములను విని అయ్యది యా పర్వతమును దిగి క్రిందనున్న కిరాతరాజ్యమునకు రాత్రి సమయమున నేతెంచెను.

**(సశేషము)**

# వినోదము-వికాసము

## భోగంచే రోగం

కొందరు ధనవంతులు తమ ధనాన్ని దుర్వినియోగంచేసి ఇంద్రియార్థము లగు శబ్దస్పర్శాదుల యొక్క అనుభవమందే దానిని వినియోగిస్తూ, విషయభోగా లందే కాలక్షేపం చేస్తున్నారు. జిహ్వేంద్రియమునకు లోబడి మితిమీరి తినుచు, రుచులకు వశపడి ఇంద్రియాలకు బానిసలై ప్రవర్తిస్తున్నారు. అధిక భోజనంవల్ల, తినరాని వస్తువులు తినుటవల్ల వారి ఆరోగ్యం చెడిపోతున్నది. ఆరోగ్యం లేని జీవితమందు శాంతి ఎట్లు లభిస్తుంది? కనుకనే వారు అశాంతికి పాల్పడి జీవితాన్ని భారభూతంగ ఒనర్చుకొంటున్నారు. ఆహార సంయమనం లేనందువల్ల, అధిక భోజనం సేవించటంవల్ల వారి జీర్ణశక్తి తగ్గిపోతూంది. కావుననే ఒక కవీశ్వరుడు కొందరు ధనవంతులకు జీర్ణశక్తి లోపిస్తున్నదనియు, బీదవారు కొయ్యలనుకూడ జీర్ణింప చేసుకొంటారనియు చమత్కారంగ చెప్పాడు.

తరింపగోరువాడు ఇంద్రియ సంయమనాన్ని కలిగియుండాలి. జిహ్వకు దాసుడు కారాదు. మితాహారం, మితభాషణ కలిగియుండాలి. భోగాలవల్ల రోగాలు సంభవిస్తాయే కాని పరిపూర్ణ సుఖం ఎన్నటికీ కలగదు. కనుకనే శాంతిని అభిలషించే వారు తమ తమ రాజ్యభోగాలను కూడ దూరంగ బెట్టి ఏకాంతమునకు వెళ్ళి ధ్యానాదులను చేసేవారు.

మానవుడు ధనానికి ధర్మకర్తయే అగును కావున దానిని ఇష్టము వచ్చినట్లు దుర్వినియోగము చేయగూడదు. భోగాదుల కొరకు వెచ్చింపగూడదు. తన అవసరాలను తీర్చుకొని మిగతా ధనాన్ని దానధర్మాలు చేయాలి. బీదలకు పంచిపెట్టాలి. ధర్మకార్యాలు చేయాలి. ధనాన్ని భోగాల కొరకు ఖర్చుపెట్టి ఆరోగ్యాన్ని చెడగొట్టుకొనుటవల్ల జీవితం దుర్భరమై పోతుంది. శాంతి మృగ్యమై పోతుంది. పవిత్రమైన మానవ జీవితం వృధా అయిపోతుంది.

కాబట్టి వివేకవంతుడు తనకున్నదానితో తృప్తిపొంది భోగాదులను తిరస్కరించి అమూల్యమైన ఈ జీవితాన్ని దైవసాక్షాత్కారం కొరకే వినియోగించాలి. ఒక్క క్షణమైనను వృధా చేయరాదు. అప్పుడే జీవితం సార్థకమౌతుంది. లక్ష్యం చేకూరుతుంది. ఆత్మానందం అనుభవమౌతుంది. ఈ భావములనే క్రింది శ్లోకము నిరూపించుచున్నది.

ప్రాయేణ శ్రీమతాం లోకే భోక్తుం శక్తిర్న విద్యతే
జీర్యన్త్యపి హి కాష్ఠాని దరిద్రాణాం మహీపతే ॥



**శిష్యుడు (శివప్రసాద్)**–మహాత్మా! గురుదేవా! ఈ ప్రపంచంలోగల కొన్ని పరిస్థితులను గూర్చి దీర్ఘంగ ఆలోచిస్తే సావధానంగ పరికిస్తే, లోతుగ విచారిస్తే ఎటువంటివారికైనా తప్పక వైరాగ్యం కలిగి తీరుతుందని తమరు సెలవిచ్చి, అట్టి పరిస్థితులు మూడిటిని గూర్చి వివరించియున్నారు. ఇంకొక్కదానిని గూర్చి చెప్పినచో ఆ పరంపర పూర్తి కాగలదు. అట్టి వైరాగ్య జనకమైన సందర్భమేదియో దయచేసి తెలుపప్రార్థన.

**గురువు (ప్రబోధానందస్వాములవారు)**– నాయనా! శివప్రసాద్! ఇప్పుడు నేను చెప్పబోయే దానిని గూర్చి బాగా యోచించినచో ఎట్టి సామాన్యుని హృదయంలోనైనా తీవ్రమైన విరాగం కలిగితీరుతుంది, మోక్షకాంక్ష పెంపొందుతుంది. అదియే మరణ దుఃఖం. ప్రతి మానవునకు పూర్వకర్మవశాత్తు ఎన్నియో దుఃఖపరంపరలు కలుగుతూనే యుంటాయి. కాని అన్నిటిలో ఇది మేటి. ఇది మహాభయంకరమైంది. ఏ శరీరమును గూర్చి "ఇది నేను" అని భావిస్తూ, దృశ్యపదార్థాలను "ఇవి నావి" అని తలంచుచు జీవుడు మురిసిపోతున్నాడో అవి అన్నియు ఈ భయంకర సంఘటన వల్ల మటుమాయమైపోతాయి. దేనిని నమ్ముకొని మహామహారాజులు గర్వాంధులైపోయిరో, ఆ శరీరమే త్రుటిలో కనుమరుగైపోతుంది.

"ఆహా! ఈ నా శరీరం ఎంత సుందరమైంది, ఈ నా ధనము ఎంత గొప్పది, ఈ నా కీర్తిప్రతిష్ఠలు ఎంతగా వ్యాపించినవి. ఆహా! నాకెందరో బంధువులు కలరు, పరిచారికలు కలరు. మయుని సృష్టివంటి మేడలు నాకు వున్నాయ్"–అని ఈ ప్రకారంగ దురభిమానంతో పలుకు వాక్యాలన్నీ ఆ మృత్యుసమయాన నీరుకారిపోతాయి. ఏ శరీరమును ఎంతో ఆప్యాయంగ పెంచి, ఎంతో సుందరంగ కూర్చి, ఎంతో ప్రేమతో లాలించి, పాలించి, పోషించి వృద్ధిచేసెనో ఆ శరీరమే పది కట్టెలలో ఒక కట్టెగ భస్మమైపోతుంది. ఆ రమణీయ శరీరమే దిక్కులేక శ్మశానంలో కుక్కలకు,

నక్కలకు ఆహారమై పోతుంది. మరణించిన పిదప పుత్రమిత్రాదులు, బాంధవాదులు శ్మశానం వరకు వెళ్ళి అతనిని సాగనంపుతారు. చివరి వరకు అతని వెంట వచ్చు వారెవరు వుండరు. ఒక్కటి మాత్రం అతని వెంట వస్తుంది. అదే అతని కర్మ.

కాబట్టి ముముక్షువులైనవారు జీవునకు తప్పక కలుగునట్టి ఈ మృత్యు సంఘటనను గూర్చి బాల్యకాలముననే చక్కగ విచారించాలి. చావుపుట్టుకలు ఇద్దరు తోబుట్టువుల వంటివారు. ఒకరిని విడిచి ఒకరు వుండరు. పుట్టాడా చావాల్సిందే. చచ్చాడా పుట్టాల్సిందే. ఒక నాణానికి బొమ్మ బొరుసూ అని ఎట్లా వుంటాయో, అట్లాగే జీవితానికి చావుపుట్టుకలు అవిభాజ్యమై వుంటాయి. ఒక్క జీవన్ముక్తుడు మాత్రమే జన్మ లేకుండ చేసుకొంటాడు; అనగా తిరిగి పుట్టడు. ఆత్మజ్ఞానం పొందినవారు మాత్రమే, స్వస్వరూపానుభూతి కలవారు మాత్రమే దైవ సాక్షాత్కారం పొందినవారు మాత్రమే ఈ చావుపుట్టుకలను తప్పించుకోగలుగుతారు.

కాబట్టి భయంకర మృత్యుసమయము రాకపూర్వమే జీవుడు అట్టి విషమ స్థితిని గూర్చి చక్కగ విచారించి నశించిపోవు క్షుద్రప్రాపంచిక పదార్థముల ఎడల, విషయ భోగాల ఎడల, ఇంద్రియార్థముల ఎడల ప్రబల వైరాగ్యమును పెంపొందింప జేసుకొని తానెవరు? తన నిజస్వరూపమేమి?" అని చక్కగ గురుసన్నిధిని విచారించి, తాను జడమైన శరీరం కాదు, తాను కర్మబద్ధుడు కాదు అని తెలిసికొని తాను నిత్య శుద్ధబుద్ధముక్త ఆత్మయే అని తలంచి, అట్టి నిర్వికారస్థితియందే నిలుకడ కలిగి తరించాలి. జన్మరాహిత్యాన్ని కలుగజేసుకోవాలి.

నాయనా! శివప్రసాద్! శరీరానికి భావికాలంలో కలుగనున్న ఈ భయంకర మృత్యు సంఘటనను గూర్చి నీవు కూడ చక్కగ విచారించు. మరణభయం తొలగి పోవుటకు ఒకే ఉపాయం వుంది. అదియే ఆత్మవిచారణ. "మరణం జడమైన దేహానికేగాని, చైతన్యమగు ఆత్మకు కాదు. నేను చైతన్యమగు ఆత్మనే కాని, దేహము కాదు" అను విచారణచే మరణభయం అంతరించి పోతుంది. కాబట్టి అట్టి తత్త్వ విచారణ గావించుకొనుచు వైరాగ్యయుతుడవై ఆత్మయందు సుప్రతిష్ఠితుడవై విరాజిల్లు. జీవితాన్ని పరితార్థ మొనర్చుకో.

**శిష్యుడు—** ఆహా! గురుదేవా! ఎట్టి మహోన్నతమైన బోధలు తమరు చేశారు. బ్రహ్మానందంగా వుంది. ముముక్షువుల కర్తవ్యాన్ని చక్కగ సూచించారు. తమరు తెలిపిన 4 దుఃఖాలను గూర్చి నేను ఇకమీదట బాగుగ విచారించి ఆ దుఃఖాలన్నిటిని అధిగమించి పోవుటకై, బ్రహ్మజ్ఞానం పొంది తరించుటకు ప్రయత్నం చేస్తా. అంతా తమ అనుగ్రహం. సెలవు.

OO

# ఎవరినీ నిందించకు

## శ్రీ ఎ. శివప్రసాద్ గారు (శ్రీకాళహస్తి)

మన ఆత్మయే భగవంతుని స్వరూపము, నిత్యము. మనిషి చేసే ప్రతి పని గురించి, అతని ఆలోచనలోని మంచి చెడులను గురించి అంతరాత్మ కంప్యూటర్ లాగ ముందుగనే ప్రబోధిస్తూంటుంది. కాని మనిషి తన అంతరంగముయొక్క మాట వినక 'అహం'కు ప్రాధాన్యత ఇచ్చి ఒడుదుడుకులు పాలౌతున్నాడు.

ఇతరులను కించపరచటం, నిందించటం తప్పు అని మనస్సు, అంతరాత్మ చెబుతూనే వుంటుంది. కానీ మానవుడు ఇతరులను నిందించటం మానడు. వేరొకరిని కించపరిస్తే నిందిస్తే తనకు కలిగే లాభం ఏమిటి? ఉపయోగం ఏమిటి? అని ఆలోచించడు.

'అహం'ను తృప్తిపరచటం కోసం ఇతరులను నిందిస్తూ, దుర్భాషలాడుతూంటాడు. అంతేకాక తన గురించి పొగుడుకొంటూ ఆత్మవంచన చేసుకొంటుంటాడు.

కావున మనిషి మొట్టమొదట తన అంతరాత్మ యొక్క మాటను శ్రద్ధగ ఆలకించి సత్ప్రవర్తన, పరోపకారబుద్ధి కలిగి, తన దినచర్యను ప్రక్షాళన చేసుకొంటూ వుండాలి. చిత్తశుద్ధిని కాపాడుకోవాలి.

నిత్య జీవితములో ఏవైనా సందేహములు వచ్చినపుడు సద్గ్రంథములను పఠించిగాని, సాధుసత్పురుషులను ఆశ్రయించిగాని సమాధానమును పొందాలి. అంతేగాని ఏదో ఒకటి అడగాలికదా అని వారిని ప్రశ్నించరాదు.

ఈమధ్య ఒక వ్యక్తి ఒక స్వామిని అడిగిన ప్రశ్న నాకు పదే పదే గుర్తుకు వస్తున్నది.

ఆ వ్యక్తి స్వామితో "స్వామీ! నాకు పూజాసమయంలో ఏకాగ్రత, (concentration) లక్ష్యము కుదురుటలేదు. మనస్సు చంచలముగ వుంటుంది. ఏమి చేయాలి?" అని అడిగాడు. అపుడా స్వామి కొంచెంసేపు ఆలోచించి అతనితో "నాయనా! ఉదయం లేవగానే నీవు చేసే పనులేమిటి? నీ దినచర్య ఏమిటి?" అని

# ఆత్మానుసంధానము

**సాధకులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.**

ఏకోఽహమనాద్యన్తరహితః సర్వవ్యాపకాకృతి
చరాచరాణాం భూతానామన్తః స్వానుభవః స్థితః.

**ఏకమై, ఆద్యంత రహితమై సర్వ వ్యాపకమై, చరాచర ప్రాణికోట్ల యొక్క అంతరంగమున స్వానుభవ రూపమున వెలయుచున్నదైన పరమాత్మ నేనే అయి యున్నాను.** OO

---

ప్రశ్నించాడు. అందులకా వ్యక్తి "మహాత్మా! ఉదయం నేను లేవగానే కాలకృత్యాలు తీర్చుకొని, కాఫీ త్రాగి, బజారుకెళ్ళి కూరగాయలు తెచ్చి, నా కోసం ఎవ్వరైనా అతిథులు (guests) వచ్చినచో వారితో మాట్లాడి తదుపరి భోజనము చేయుటకు ముందుగా పూజకు కూర్చుంటాను" అని ప్రత్యుత్తరమిచ్చాడు.

అది విని స్వామి "నాయనా! ఉదయం లేవగనే స్నానానంతరము మొట్ట మొదట పూజా కార్యక్రమములను నిర్వహించాలని నీకు తెలియదా? నీవు పూజా కార్యక్రమములకంటే ఇతర పనులకే ప్రాధాన్యత ఇచ్చావు. అటువంటప్పుడు నీకు పూజలో ఏకాగ్రత ఎలా కుదురుతుంది? కావున దైవకార్యము, పూజ, ధ్యానాదులను ముందుగ చేస్తూండు. 'పూజ పని అయిన పిదపనే ఇతర కార్యక్రమములలో ప్రవేశించాలి' అని దృఢ నిశ్చయము కావించుకో. అపుడు నీకు ధ్యానమందు ఏకాగ్రత, శాంతి లభిస్తాయి" అని వచించాడు.

ఆ సమాధానము విని ఆ వ్యక్తి మిక్కిలి సంతోషించి అప్పటి నుండి ఏకాగ్రతతో, శ్రద్ధతో పూజ, జపము, ధ్యానములను ప్రాతఃకాలముననే చేయసాగెను.

కావున మనుజుడు తన అంతరాత్మ చెప్పినట్లు సన్మార్గమున నడచుకోవాలి. ఇతరులను నిందించుటను వదలివేసి పరోపకారపరాయణత్వము కలిగియుండాలి. దినచర్యలో దైవకార్య నిర్వహణకు, జపపూజాధ్యానాదులకు ప్రథమస్థానమొసంగి జన్మ సార్థకతనొందాలి. OO

# ఉపమానము ద్వారా బోధ

ఛాయా శరీరే ప్రతిబిమ్బగాత్రే
యత్స్వప్న దేహే హృది కల్పితాఙ్గే
యాథాత్మ్య బుద్ధి స్తవ నాస్తికాచి
జ్జీవచ్ఛరీరే చ తథైవ మాస్తు

శరీరము యొక్క నీడయందును, ప్రతిబింబించిన శరీరమందును, స్వప్నమందలి దేహమందును, మనస్సునందు కల్పింపబడిన శరీరమందును ఎవరికిని సత్యత్వ బుద్ధి యుండదు. అవన్నియు కల్పితములేయని ప్రతివాడును తెలుసుకొనును.

అదే ప్రకారము జీవించియున్న ఈ శరీరాదిరూప ఉపాధియు పైన తెలుపబడిన దృష్టాంతములందువలె వాస్తవముగ కల్పింపబడినదేయని ఎఱుంగవలెను.ఏది సత్యమో అది త్రికాలములందు యుండవలెను. ఈ శరీరమట్లు లేదు. అది పుట్టుక పూర్వము లేదు, మరణించిన పిదప లేదు. ఆత్మ ఒకటియే త్రికాలములందు సత్యము. కాబట్టి ముముక్షువగువాడు ఆత్మయే తానని భావించి దేహాదులందు మమత్వము వీడవలెను.

భ్రాన్తస్య యద్యద్భ్రమతః ప్రతీతం
బ్రహ్మైవ తత్తద్రజతం హి శుక్తిః
ఇదం తయా బ్రహ్మ సదైవ రూప్యతే
త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్

ముత్తెపుచిప్పను చూచినపుడు అది వెండిగ తోచును. కాని వాస్తవముగ అది వెండికాదు. ముత్తెపుచిప్పపై వెండి అనునది ఆరోపింపబడినది. ఆరోపింపబడిన వస్తువు ఎన్నటికిని సత్యము కాదు. అధిష్ఠానమైన వస్తువే సత్యమైనది.

అట్లే బ్రహ్మమునందు ఈ జగత్తు భ్రాంతిచే కల్పింపబడినది. భ్రాంతిజన్యమగు వస్తువు సత్యమెన్నటికిని కాదు. కాబట్టి ముముక్షువులగువారు సత్యవస్తువగు బ్రహ్మమునందే (ఆత్మయందే) దృష్టిని నిలిపి, భ్రమరూపమగు జగత్తు అసత్యమని నమ్మి, విషయాదులందు తగుల్కొనక, బ్రహ్మానందము ననుభవించుదురుగాక!

OO

మట్టిపంటిది దేహమోరన్నా
జడమైనదేయది, చిత్స్వరూపము కాదుకాదన్నా
కుండవంటి మేనుగాంచి
చేతనంబని తలచువాడు
సత్యమేమియు తెలియలేకనె
గోతిలో పడిపోవు తథ్యము.
తత్త్వసారము తెలిసికోరన్నా
సద్గురుని చెంత, నిజముగనుగొని లాభమొందన్నా

ప్రపంచములో ఉన్నదానిని ఉన్నట్లుగను, లేనిదానిని లేనట్లుగను తెలుసుకొనవలెనేకాని ఉన్నదానిని లేనట్లు తలంచువాడు, లేనిదానిని ఉన్నట్లు భావించువాడు; లేక మరియొక విధముగ తలంచువాడు–ఇట్టి విపరీత భావనచే దుఃఖమునకు లోనైపోవును.

శరీరము వాస్తవంగ కుండవంటి పదార్థము. పంచభూతములచే చేయబడింది, జడమైంది. అట్టిదానిని మనుజుడు చైతన్యమని భావించి, అదియే తానని తలంచి ఆ మలినపదార్థములందు సౌందర్యమును వీక్షించుచు సుఖాభాసమును బడయుచున్నాడు. ఇది వివేకవంతుల పనికాదు. వివేకముగలవాడు సద్గురువు నాశ్రయించి, తత్త్వసారాన్ని గ్రహించి, తాను వాస్తవంగ సచ్చిదానందపరమాత్మయే అని నిశ్చయించి, సాధనములద్వారా, అభ్యాసంద్వారా అట్టి స్థితియందు నిలకడను పొంది పరమశాంతిని అనుభవించాలి.

జీవుడా! సత్యమును తెలుసుకో! అజ్ఞాననిద్ర నుండి మేలుకో. స్వస్వరూపమందు నిలకడ పొందు. పరమశాంతిని అనుభవించు. OO

# వేదాంతభేరి శాశ్వత సభ్యులు
## (Life Members)

**వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :-**

**శాశ్వత చందా రు. 300/-లు**

1. శ్రీ టి.సి.ఎస్. శర్మ గారు – సికింద్రాబాద్
2. శ్రీ టి. మధుసూదనగుప్త గారు – ధర్మవరం
3. శ్రీ ఎస్. సాంబశివరావు గారు – గుడ్డికాయలంక
4. శ్రీ ఎ. సీతారామశాస్త్రి గారు – హైదరాబాద్
5. శ్రీ పాండురంగ గారు – మారికల్
6. శ్రీ పి.ఎస్.వి. నాయుడు గారు – హైదరాబాద్
7. శ్రీ బి. వేంకటస్వామి గారు – సిద్ధరామపురం
8. శ్రీ రామదాసు గోపయ్య వి. గారు – షోలాపూర్
9. శ్రీ డా॥ ఇ. వేంకటేశ్వర్లు గారు – కావలి
10. శ్రీ సి. సీతారాములు గారు – హైదరాబాద్
11. శ్రీ సిహెచ్.వి. ప్రసాదరావు గారు – తెనాలి
12. శ్రీ డా॥ అశోక్ కె. వర్మ గారు – నంబూరు
13. శ్రీ వి. చంద్రశేఖర్ గారు – జగిత్యాల
14. శ్రీ ఎమ్. వీరేశలింగం గారు సికింద్రాబాద్

○○

## సనత్కుమార ఉవాచ

**...గదా చక్రం గరుడో యస్య వాహనమ్**
**...తలే యస్య స మే విష్ణుః ప్రసీదతు.**

***ఎవని చేతులలో శంఖము, చక్రము, గద శోభిల్లుచున్నవో, ఎవనికి గరుత్మంతుడు వాహనమై యొప్పుచున్నాడో అట్టి విష్ణుభగవానుడు నా యెడల ప్రస... ుడగుగాక!***

# జంటనగరములలో శ్రీ శుకబ్రహ్మాశ్రమ గ్రంథములు లభించు చోట్లు—

1) శ్రీ బి. శ్రవణ్‌కుమార్ గారు అధ్యక్షులు— శ్రీ విద్యాప్రకాశానంద సత్సంగము, హైదరాబాద్, శ్రీ రాఘవేంద్ర లైట్ హౌస్, 4–3–420/5, హనుమాన్ టెకడి లేన్, ట్రూప్ బజార్, హైదరాబాద్, ఫోన్ : 45750 Res. 875245

2) శ్రీ జి. శివయ్య గారు— (అధ్యక్షులు— శ్రీ ప్రబోధానంద ప్రశాంతి నికేతన్— కొండాపూర్) శ్రీ వేంకటేశ్వర ఎలక్ట్రికల్ ఏజెన్సీస్, 7–2–642, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్.

ఫోన్ : 77028, 831426, 821549, Res. 847719, 845606

## కొన్ని పుస్తకశాలల అడ్రసులు

ఎ) టాగోర్ పబ్లిషింగ్ హౌస్, 20, వైశ్య హోస్టల్ బిల్డింగ్స్, కాచిగూడ 'X' రోడ్స్, హైదరాబాద్–27. ఫోన్ : 668329

బి) షిర్డి బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 15–1–33, సిద్ద్యంబర్ బజార్, పాత ఫీల్‌ఖానా, హైదరాబాద్–12

సి) గాంధి బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్

డి) నవదుర్గ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, పాత తోప్‌ఖానా–5/3/372, హైదరాబాద్–12

ఇ) ఉమాశంకర్ పబ్లికేషన్స్, సిద్ద్యంబర్ బజార్, హైదరాబాద్

ఎఫ్) నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సుల్తాన్ బజార్, హైదరాబాద్–195

## భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి

శ్రీకాళహస్తియందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు నూతనముగ నెలకొల్పబడిన 'భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి' నిమిత్తము నూతనముగ వచ్చిన విరాళముల వివరములు—

| | రు. |
|---|---|
| 1) శ్రీ డా॥ ఎస్. దుర్గాబాయి గారు, కె.జి.ఎఫ్. | 11,116/– |
| 2) శ్రీ జి. రాధాకృష్ణమూర్తి గారు, హైదరాబాద్ | 1,116/– |
| 3) శ్రీ డి. విశ్వనాథం గారు, ఊదర | 1,116/– |

| | | |
|---|---|---|
| 4) | శ్రీ నేదునూరి పట్టాభిరామారావు గారు, హైదరాబాద్ | 1,000/- |
| 5) | శ్రీ ఎ. కృష్ణమూర్తి గారు, అరక్కోణం (టి.ఎన్.) | 4,000/- |
| 6) | శ్రీ ఎ. పద్మావతి గారు, సాలూరు | 1,120/- |
| 7) | శ్రీ బి. రామకృష్ణమూర్తి గారు, నంద్యాల | 1,116/- |
| 8) | శ్రీ వి. వెంకయ్య గారు, హైదరాబాద్ | 1,116/- |
| 9) | శ్రీ ఎమ్. భాగ్యవతి గారు, సికింద్రాబాద్ | 2,000/- |
| 10) | శ్రీ ఎస్.వి. ఆనందమోహన్ గారు, నంద్యాల | 5,000/- |
| 11) | శ్రీ పి. చిన్న సుబ్బరాయులు గారు, రాజంపేట | 1,116/- |
| 12) | శ్రీ బి. వేంకటరెడ్డి గారు, మారాయిగారిపల్లె | 1,116/- |
| 13) | శ్రీ పి. బ్రహ్మయ్య గారు, కడప | 1,000/- |
| 14) | శ్రీ పి. గురుమూర్తి గారు, ప్రొద్దుటూరు | 1,000/- |
| 15) | శ్రీ ఎమ్. భవానీప్రసాద్ గారు, ఎస్.బి.ఆర్.పురం(పుత్తూరు) | 116/- |
| 16) | శ్రీ జి. రామచంద్రరాజు గారు, ఎస్.బి.ఆర్. పురం | 116/- |
| 17) | శ్రీ జి. పద్మావతమ్మ గారు, పుత్తూరు | 116/- |
| 18) | శ్రీ ఎ. వేంకటరాజు గారు, ఎస్.బి.ఆర్. పురం | 120/- |
| 19) | శ్రీ ప్రగతి స్త్రీల సమాజము, పుత్తూరు | 250/- |
| 20) | శ్రీ టి. కృష్ణయ్య గారు, సికింద్రాబాద్ | 116/- |
| 21) | శ్రీ బిహెచ్. ఆంజనేయశర్మ గారు, మంగళగిరి | 116/- |
| 22) | శ్రీ డా॥ సి.ఎస్. రామశర్మ గారు, కాకినాడ | 116/- |
| 23) | శ్రీ కమలమ్మ గారు, ఈదర | 216/- |
| 24) | శ్రీ సి.హెచ్.వి. కృష్ణారావు గారు, విజయవాడ | 116/- |
| 25) | శ్రీ ఎ. రామచంద్రరావు గారు, నూజివీడు | 500/- |
| 26) | శ్రీ డి. వేంకట సత్యనారాయణరావు గారు, ఈదర | 500/- |
| 27) | శ్రీ చెలికాని ప్రసాద్ గారు, పోతేపల్లి | 600-/ |
| 28) | శ్రీ కె. బాజ్జీ గారు, ఎల్లంపల్లి | 300/- |
| 29) | శ్రీ వేమయ్యచెట్టి గారు, కలికిరి | 150/- |

30) శ్రీ తోట వీరయ్య గారు, హైదరాబాద్ 516/-
31) శ్రీ కె. హరనాథ్ గారు, హైదరాబాద్ 116/-
32) శ్రీ కె. నారాయణ రెడ్డి గారు, హైదరాబాద్ 116/-
33) శ్రీ పి. సూర్యనారాయణ గారు, తణుకు 500/-
34) శ్రీ ఆకెళ్ళ మంగమ్మ గారు, కాకినాడ 200/-
35) శ్రీ బి. కృష్ణమూర్తి గారు, హైదరాబాద్ 516/-
36) శ్రీ ఎస్. రామయ్య శెట్టి గారు, రాజంపేట 516/-
37) శ్రీ ఎమ్. సుబ్రమణ్యం గారు, నగిరిపాడు 516/-
38) శ్రీ సి. రంగారెడ్డి గారు, కంసాలపల్లె 516/-
39) శ్రీ ఎమ్. సుబ్బరామచంద్ర గారు, హెచ్. చెర్లోపల్లి 416/-
40) శ్రీ బి. సుబ్రమణ్యం గారు, కడప 516/-
41) శ్రీ డా॥ సి. శంకరయ్య గారు, నందలూరు 216/-
42) శ్రీ పి. వేంకట సుబ్బయ్య గారు, నందలూరు 216/-
43) శ్రీ వి. నారాయణమూర్తి గారు, రాజంపేట 216/-
44) శ్రీ వి. సుబ్రమణ్యం గారు, రాజంపేట 216/-

OO

(13వ పేజీ తరువాయి)

మాం చయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. (14-26 గీత)

'ఎవడు నిర్మల, అచంచల భక్తితో నన్ను సేవించునో అట్టివాడు ఈ సత్వరజస్తమోగుణములు మూడింటిని దాటివైచి బ్రహ్మసాక్షాత్కారమును బడయు యున్నాడు' అఖండమగు జ్ఞానోపదేశమును గీతలో చేసి చేసి తుట్టతుదకు భక్తిని భగవానుడు ప్రతిపాదించియున్నారు. దీనినిబట్టి భక్తియొక్క సహాయముచేతనే జ్ఞానము పరిపక్వము కాగలదని స్పష్టమగుచున్నది. ఈ ప్రకారముగ సర్వేశ్వరుని [illegible] సాధించుటకు పలసిన భక్తిభావములను హృదయసీమయందు [illegible] ప్రయత్నముద్వారా ఒక్కొక్క గుణమును దాటి ముందునకు [illegible] గుణాతీతస్థితిని చేరుకొనవలెను. OO






1. కడప జిల్లా ప్రొద్దుటూరు తాలూకాలోని వనిపెంట గ్రామము నందు నూతనముగ నిర్మింపబడిన శ్రీ కన్యకాపరమేశ్వరి అమ్మవారి ఆలయము యొక్క ప్రారంభోత్సవము 5.2.1993 తేదీయందు శ్రీ స్వాములవారి అధ్వర్యమున జరుపబడును.
2. వరంగల్ జిల్లాలోని నర్సంపేట గ్రామమునందు 4.3.1993 తేదీ మొదలుకొని 6.3.1993 తేదీ వరకు జరుగబోవు "శ్రీ పరివ్రాజక సదస్సు"నందు శ్రీ స్వాములవారు పాల్గొందురు.
3. కరీంనగర్ జిల్లా కేశవపట్నం గ్రామము నందు శ్రీ సనాతన వేదాంత జ్ఞానసభ యొక్క 67వ సమావేశము శ్రీ విద్యానందగిరి స్వాములవారి అధ్వర్యమున, శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి అధ్యక్షతన 8.3.1993 తేదీ మొదలుకొని 10.3.1993 తేదీ వరకు జరుగును.
4. బొంబాయి నగరములో అశాంతి పరిస్థితులవలన ఈ నెల 10వ తేదినుండి 9 రోజులు జరుపదలంచిన గీతామహోత్సవ కార్యక్రమము వాయిదాపడినది. ○○

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram,
Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**

# పాతంజల యోగసూత్రములు 1-1

## (సంగ్రహము)

## అథ యోగానుశాసనమ్

**తా॥** ఇపుడు యోగశాస్త్రము ఆరంభింపబడుచున్నది.

వ్యాఖ్య :- మోక్షమను ముక్కాలిపీటకు భక్తి, యోగము, జ్ఞానము- అను మూడు కాళ్ళు గలవు. యోగమార్గమును గూర్చి పతంజలి మహర్షియు, భక్తి మార్గమును గూర్చి నారద మహర్షియు, జ్ఞాన మార్గమును గూర్చి వ్యాసమహర్షియు సూత్రములను రచించియున్నారు. పతంజలి మహర్షి రచించిన ఈ యోగ సూత్రములందు యమనియమాది అష్టాంగములను గూర్చి విపులముగ బోధించినారు. 'అథ' అను పవిత్రమైన పదముతో ఈ యోగసూత్రములు ప్రారంభింపబడినవి. సృష్ట్యారంభ సమయమున "ఓమ్ అథ"- అను ఈ రెండు శబ్దములు బ్రహ్మదేవుని ముఖము నుండి వెలువడినవని పెద్దలు చెప్పుదురు. కాబట్టి ఆ రెండును మంగళకరములైనవి.

యోగమనగా 'కలియుట' అని అర్థము. 'యుజ్యతే' ఇతి యోగః. మనస్సు ఆత్మయందు లయించి ఆత్మాకారమగుటయే యోగము. అదియే మోక్షస్థితి. ఆ క్రియ ఎట్లు సంభవించునో, యోగమునెట్లు సాధింపవలెనో రాబోవు సూత్రములు తెలుపగలవు. కనుక ముముక్షువులకు ఈ యోగసూత్రములెంతయో ఉపకరించగలవు.

ఓం